# శ్రీ హనుమద్విషయ

# సర్వస్వము




[illegible] కర్త :

'సాహి[illegible]' ([illegible])

'వైద్యవిద్వాన్' 'భాషాప్రవీణ' 'హిందీ విశారద'

**అన్నదానం చిదంబరశాస్త్రి,**

M. A & M. A., P. O. L.,

ప్రకాశనము :

## శ్రీ హనుమదాధ్యాత్మిక కేంద్రము

**ఆరేపల్లి అగ్రహారం-522 309.**

గుంటూరు జిల్లా.

శ్రీ దుందుభి
హనుమజ్జయంతి
1982

శ్రీ రామరక్ష - సర్వజగద్రక్ష
వెల : 8-00
ఆంజనేయరక్ష - అఖిలజగద్రక్ష

ప్రతులకు:
ఎ. జానకీదేవి
7-10-5 (1) బి
లాయరుపేట
ఒంగోలు-523 002.

ముద్రణ :
"తిరుమల"
విజయవాడ-520 002.

# ఒక్క మాట

ఇది కలికాలము, జీవకోటికి కష్టకాలము. కాలచక్ర మాగక వేగముగా పరుగిడుతునే యున్నది. అంతకుమించి మానవుడు వేగముగా పరుగిడుచున్నాడు. అతడు అలస స్వభావి. ప్రతి పనియందు తేలికమార్గమును చూచుకొను చున్నాడు. సుఖమును కోరునే తప్ప అందుకు పడవలసిన కష్టముల బడడు. హక్కును కాంక్షించునే కాని బాధ్యత నెరుగడు ఫలితము కాంక్షించునే తప్ప సేవకు సిద్ధము కాడు. సద్యః ఫలిత మిచ్చుదానిని తప్ప నమ్మడు. కనపడు దానియందు తప్ప విశ్వాస ముంచడు. ఇట్టి విచిత్ర స్వభా వియై కూడ ముముక్షువులగు మహానుభావుల మాటపై విశ్వాసములేకున్నా స్వార్థ ప్రేరణతో కాని, పాపభీతితో కాని దైవధ్యానమున కుద్యుక్తుడగుచున్నాడు. దైవము భక్తుని పరీక్షించునని పురాణములు చెప్పుచున్నవి. కాని భక్తుడే దైవాన్ని పరీక్షిస్తున్నాడు. కొన్ని కోర్కెలకై కొంతసేపు దైవాన్ని ధ్యానిస్తాడు. దైవానుగ్రహము కల్గి కోరిక నెరవేరెనా ఆ దైవమున్నట్లే. లేదా అతడు లేడనియనుకొని యూరుకొనడు. దైవమును నిందించి; విమ ర్శించి లోకమునకు చెప్పజూచును. అట్టి మనుజుని కూడ అనుగ్రహించి సమాధానపరచగల భక్తసులభుడు, దయా ళువు హనుమంతుడే.

శ్లో॥ ఆంజనేయః పూజితశ్చేత్ పూజితా స్సర్వదేవతాః
హనుమన్మహిమా శక్యో బ్రహ్మణాఽపి న వర్ణితుమ్॥

హనుమన్మహిమను బ్రహ్మ కూడ వర్ణింపజాలడు. ఆంజనేయుని పూజించిన సర్వదేవతలను పూజించినట్లే.

హనుమంతుని తన ఇంట ఎవడు ప్రతినిత్యము భక్తితో పూజించునో వాని యింట హనుమత్ప్రభావమున ఎల్లప్పుడు సంపదలు నిలచును. దీర్ఘాయువు నందును. సర్వత్రా విజయము చేకూరును. ఆంజనేయుని పూజ జరుగు ఆ ప్రదేశమందు మహామారి వగైరా భూత గ్రహ బాధలుండవు. ఇంతకుమించి మానవుడు కోరునదేమి?

శౌనక సంహితలో ఈవిధముగా తెలుపబడినది–

శ్లో॥ యత్రాస్తి భోగో నహి తత్ర మోక్షః
యత్రాస్తి మోక్షో నహి తత్ర భోగః
శ్రీమారుతే స్సేవన తత్పరాణాం
భోగశ్చ మోక్షశ్చ కరస్థ ఏవ॥

ఎచ్చట భోగముండునో అచ్చట మోక్షముండదు. ఎక్కడ మోక్షముండునో అక్కడ భోగముండదు. కాని ఆంజనేయ పూజాతత్పరులకు మాత్రము భోగము, మోక్షము కూడా సిద్ధించును. కావున సర్వజనులకు హనుమత్పూజయే కర్తవ్యము, సర్వశ్రేయోదాయకము. హనుమద్భక్తులు సులభముగా పూజ, స్తోత్రాదులు చేసుకొనుటకు ఈ చిన్న పొత్తము నందించుచున్నాను. దీనిని కరసాధనముగా గ్రహించి, అనుదినము హనుమంతు నారాధించి ధన్యులగుదురని, ఆ రీతిగా నన్ను కృతకృత్యులను చేయగలరని నా విశ్వాసము.

హనుమంతుని శక్తి మహత్తరమైనది. ఆతని యను గ్రహము కూడా అట్టిదే! అట్టి యనుగ్రహమును పొందుటకు విజయవంతములైనవి, అనేకులగు ఉపాసకులచే నిర్ధారింపబడినవి, మహర్షులచే గుర్తింపబడినవి యైన విషయము లన్నియు ఇందీయబడినవి. హనుమంతుని విషయమున పలువురు ప్రశ్నించు ప్రశ్నలకు సమాధానములగు విషయములు అందీయబడినవి. అసాధ్యసాధకుడగు హనుమంతు నారాధించి పొందలేనిదిలేదు. భక్తితత్పరులై ఆ స్వామి యనుగ్రహమునకు పాత్రులగుటకు చూపబడిన ఇందలి మార్గములను సద్వినియోగము చేసికొన ప్రార్థించుచు శ్రీ హనుమత్ప్రభునకు వందన శతము లర్పించుకొనుచున్నాడను.

శ్లో॥ నమోఽస్తుతే వాయుసుతాంజనేయ!
నమోఽస్తుతే శ్రీహనుమన్మహాప్రభో!
నమోఽస్తుతే వానరవీర! నిత్యం
నమోఽస్తుతే రాఘవ ముఖ్యభక్త!

ఇట్లు,
భక్తవిధేయుడు
అన్నదానం చిదంబరశాస్త్రి.

# విషయసూచిక

1) ముఖ్య విషయములు

హనుమజ్జననం, జయంతి, విద్యాభ్యాసం, కళ్యాణము, నివాసము, చిరంజీవి, నామమహిమ; హనుమత్క్షేత్రములు; వాగ్దానం, భవిష్యద్బ్రహ్మ, అవతారములు, సిందూర శనివార, మంగళవార మాహాత్మ్యము, శనిపీడా నివారకుడు, కదళీవనార్చన, నాగవల్లీదళార్చన, పంచ సంఖ్య; సాలగ్రామ, శ్వేతార్కం; శతార్కం, పంచముఖ రూపం, హనుమత్కుండం, హనుమత్ప్రదక్షిణములు, సుందరకాండ, గ్రహదోషశాంతులు, రోగనాశం, వేద వాచ్యత, విదేశాలలో హనుమంతుడు శ్రీ పరాశరసంహిత.

2) ధ్యాన విభాగము

ఆంజనేయసుప్రభాతం, మంగళాష్టకం, సర్వకార్య సాధక, శత్రుంజయ, పంచముఖ, చతుర్భుజ; వింశతిభుజ, ప్రసన్నాంజనేయ, వీరాంజనేయ, ఆపన్నివారక, రోగహార సంతానహనుమత్, స్వప్నాంజనేయ; సర్వకాల, అభయాంజనేయ పరమాత్మరూపధ్యానాలు.

3) పారాయణ విభాగము

హనుమాన్ చాలీసా, మాలామంత్రం హనుమత్ స్తోత్రం, లాంగూలాస్త్రం, శ్రీరామదూతం, బజరంగ్ బాణ్, హనుమత్సూక్తం.

4) పూజా విభాగము

హనుమత్పూజవిశిష్టత, స్వామి కిష్టమైన పూజా ద్రవ్యాలు, పూజింపదగినపర్వదినాలు, కలశారాధన, విఘ్నేశ్వర పూజ, పూజావిధానం, అష్టోత్తరశతనామావళి, సువర్చలాష్టోత్తరము, సహస్రనామములు, మంత్రపుష్పము.

# పితృవందనము



"ఈ రూపునీయఁగని నా
కీర్తిగ మంచి నెంచు నింగిత మిడు సీ
తారమాంబా లక్ష్మీ
నారాయణులన్ పితరుల నమములఁగొలుతున్".

# మనవి

రోజు రోజుకూ మంచి అడుగంటిపోతోంది. చెడు ఆకాశాన్నంటుతోంది. ఎవరికి కష్టం వచ్చినప్పుడు వారు చెడును గూర్చి బాధ వ్యక్తంచేయటం తప్ప తాము చేసే దానిని పరిశీలించుకొనేవారు లేరు. ధర్మాచరణ తక్కువై అధర్మం అనేక రూపాలలో అభివృద్ధి అవుతోంది. అందువల్లనే నిద్రలేచింది మొదలు దురదృష్ట రములు హృదయ విదారకములు అయిన సంఘటనలే వింటున్నాము. దీనంతటికీ కారణం పాపభీతి లేకపోవటం. దాన్ని గ్రహించకపోగా పాపపుణ్యాలులేవనే ప్రచారాలు పెరిగిపోతున్నాయి. ప్రతివారుశక్తికొలది ధార్మిక కృషి చేయవలసిన సమయ మిది. ఏ ఒక్క ధార్మికసంస్థో సమాజంలోని ఈ దోషాన్నంతనీ పోగొట్టలేదు. ప్రతి ఇల్లూ ఒక ధార్మిక కేంద్రం కావాలి. అవకాశమున్న మార్గంలో ధార్మికప్రచారం చేయాలి. అందుకే మా సేవ నీరీతిగా అందిస్తున్నాము. వ్యక్తి వ్యక్తి వద్దకూ వెళ్ళి చెప్పలేకున్నా పుస్తకరూపంలో అనేక వ్యక్తులవద్దకు విషయం అందించవచ్చు కాబట్టి 'శ్రీ హనుమదాధ్యాత్మిక కేంద్రం' నుండి ఇట్టి ఆధ్యాత్మిక ప్రచారాన్ని చేయ సంకల్పించాము. సమాజానికవసరమైన ముఖ్యమైన విషయాలెన్నో అందించాలనే ప్రణాళిక వున్నది. అది మీరిచ్చు ప్రోత్సాహమునుబట్టే సాగుతుంది.

గ్రంథముద్రణకు శ్రీ గిరిరాజ శేషగిరిరావుగారు 116/- శ్రీ తాతా మోహనరావుగారు 100/- శ్రీ ఎర్మారెడ్డి మల్లారెడ్డిగారు 25/-లు విరాళముగా ఇచ్చినందుకు వారికి గ్రంథ ముద్రణలో ప్రత్యక్ష పరోక్ష సహాయకులందరకు మా కృతజ్ఞతలు.

—గ్రంథ ప్రకాశకులు



శ్రీ హనుమతే నమః

శ్రీ మహా గణాధిపతయే నమః ॥



# శ్రీ హనుమ ద్విషయ సర్వస్వము



## కొన్ని ముఖ్య విషయములు

### శ్రీ హనుమ జ్జననం :

లోకానుగ్రహ కాంక్షతో, రాక్షస సంహారార్థము హనుమంతు డుదయించెను. కేసరి భార్యయగు అంజనాదేవికి ఫలరూపమున అగ్ని, వాయువుల సహాయమున అందిన శివ తేజస్సువలన జన్మించెను. కావున హనుమంతుడు కేసరీ నందనుడు, ఆంజనేయుడు, అగ్నిపుత్రుడు, పవన సుతుడు, శంకర తనయుడు అని కీర్తింపబడుచున్నాడు.

### * హనుమ జ్జయంతి *

హనుమంతుడు వైశాఖమాస కృష్ణపక్షమున శనివారమునాడు పూర్వాభాద్రా నక్షత్రమందు వైధృతి యోగమున మధ్యాహ్న సమయమందు కర్కాటకలగ్నాన కౌండిన్యగోత్రమున జన్మించెను.

### * విద్యాభ్యాసము *

శ్రీ హనుమంతుని గురువు సూర్యుడు. పూర్వ - పశ్చిమ పర్వతములు రెంటిపై రెండు పాదములుంచి వేద -

వేదాంగములు, సకల శాస్త్రములు నేర్చెను. హనుమంతుడు నవవ్యాకరణవేత్త. అతనికి తెలియని విద్య లేదు.

## * హనుమత్కల్యాణము *

జ్యేష్ఠ శుద్ధ దశమినాడు గురువగు సూర్యుని ఆజ్ఞపై అతని వర్చస్సును సువర్చలగా హనుమంతుడు స్వీకరించెను. నాడే శ్రీ సువర్చలా హనుమత్కల్యాణము.

| ప్రవర : | హనుమంతుడు : | సువర్చల : |
|---|---|---|
| ముత్తాత | అంగీరసుడు | బ్రహ్మ |
| తాత | మరీచుడు | కశ్యపుడు |
| తండ్రి | వాయుదేవుడు | సూర్యుడు |
| గోత్రం | కౌండిన్య | కాశ్యప |

## * నివాసము *

మేరుపర్వతమునకు నైరుతి దిక్కున గంధమాదన పర్వతము కలదు. ఆ పర్వతముపై వివిధ పుష్ప ఫల పూర్ణమగు వృక్షములలో ఆనందదాయకమగు కదళీవనమున రామధ్యాన తత్పరుడై హనుమంతు డుండును.

## * చిరంజీవి *

వాయుదేవుడు తన కుమారునిపై ఇంద్రుడు వజ్రాయుధము ప్రయోగించుటకు కోపించి లోక మంతట వాయువు నుపసంహరించెను. లోకరక్షణార్థము బ్రహ్మాదులు వాయు

దేవు ననునయపరచి హనుమంతునకు వివిధ వరము లిచ్చుచు దీర్ఘాయువును ప్రసాదించిరి. సంజీవ పర్వతము తెచ్చి లక్ష్మణుని బ్రతికించినందుకు సంతసించిన శ్రీరాముడు హనుమంతుని చిరంజీవిగా నాశీర్వదించెను. చిరంజీవుల ధ్యానము కూడ అపమృత్యువును తొలగించునని ప్రాతఃస్మరణ చెప్పుచున్నది.

## * సర్వదేవమయుడు *

బ్రహ్మయే స్వయముగా హనుమంతుని సర్వదేవాంశ సంభూతునిగా, సర్వదేవమయునిగా చెప్పి అతనిని పూజించుటచే దేవత లందరూ పూజింపబడినట్లేయనుచు రాక్షస నివారణకై గ్రామగ్రామములందు హనుమ దాలయము లేర్పడు నని పలికెను.

## * నామ మహిమ *

బుద్ధి, బలము, కీర్తి, ధైర్యము, నిర్భయత్వము, అరోగత, జాడ్యములు తొలగుట, వాక్పటుత్వము మున్నగున వన్నియు హనుమ న్నామస్మరణ వలన చేకూరును.

శ్లో॥ పవిత్రం హనుమన్నామ – ద్వాదశావృత్తిమాత్రతః ।
యే స్మరంతి జనా స్తేషాం – కార్యసిద్ధి ర్భవే ద్ధ్రువమ్॥

శుభాశుభములం దన్నిట పవిత్రమగు హనుమ న్నామము భక్తితత్పరులై పండ్రెండుమార్లు తలచిన కార్యసిద్ధి యగునని పరాశర మహాముని తెల్పెను.

## * హనుమత్పరివారము *

హనుమంతునకు సుషేణుడు ఛత్రము పట్టును. మైందుడు, ద్వివిదుడు చామరములు ధరింతురు. మాగనుడు బెత్తము పట్టుకొని నడచును. గంధమాదనుడు ముందు నడచుచు వంశకీర్తనము చేయును. ద్వివిదుడు వివిధ స్తోత్రములు చేయుచుండును. పనసుడు పాదుకలను పట్టుకొని హనుమంతుని పాదసేవన మొనర్చును. వృద్ధుడగు జాంబవంతుడు నీతిమార్గము దెల్పుచు హితము జెప్పుచు మంత్రాంగము నెరపుచుండును. సంకటము లన్నింటిని పో నడచుచు వెడలు హనుమంతుని గవాక్షాది ప్రముఖు లందరు అనుగమింతురు. హనుమంతుని వాహనము ఒంటె.

చక్కగా అలంకరించిన దానిపై అతడు పంపాసరోవర ప్రాంతమున విహరించుచుండును.

## * హనుమద్దశ వీరులు *

1. గవాక్షుడు 2. శరభుడు 3. నీలుడు 4. గవయుడు 5. గంధమాదనుడు 6. నలుడు 7. గజుడు 8. ప్రహస్తుడు 9. దర్దురుడు 10. వేగవంతుడు.

ఈ దశవీరులు పూర్వాముఖమున రక్షకులుగ నుందురు.

## * అష్ట మహాబలులు *

1. ఋషభుడు 2. సుముఖుడు 3. పృథుడు 4. దధి

ముఖుడు 5. జ్యోతిర్ముఖుడు 6. సంపాతి 7. రుంధ్రగ్రీవుడు 8. కేసరి.

ఈ మహాబలులు ఐదు లక్షల కపివీరులతో దక్షిణ తీరమున నుందురు.

* పంచ హరి శ్రేష్ఠులు *

1. మరీచి, 2. కేసరి, 3. రంభుఁడు 4. తరణుఁడు 5. గోముఖుఁడు.

ఈ వానర శ్రేష్ఠులు పదునాలుగు వేల కపివీరుల గొని పశ్చిమ తీరమున నుందురు.

* కపి విక్రమ చతుష్టయం *

1. సువేషుఁడు 2. హరిలోముఁడు 3. విద్యుద్దంష్ట్రుఁడు 4. శతబలి.

ఈ పరాక్రమ శాలురు తొమ్మిది వేల వానర వీరులతో ఉత్తర తీరమున రక్షకులుగ నుందురు.

* హనుమత్పీఠములు *

శ్లో॥ కుండినం నామ నగరం-శ్రీభద్రం. కుశతర్పణం
పంపాతీరం, చంద్రకోణం-కాంభోజం, గంధమాదనమ్॥

శ్లో॥ బ్రహ్మావర్తపురం చైవ-నైమిశారణ్యమేవ చ
సుందరం నగరంచైవ-రమ్యం శ్రీ హనుమత్పురమ్॥

శ్లో॥ ఏతాని వాయుపుత్రస్య-పుణ్యస్థానాని నిత్యశః
యస్స్మరేత్ప్రాతరుత్థాయ-భుక్తిం ముక్తించ విందతి॥

ఈ పదునొకండు పుణ్యస్థానములు హనుమత్పీఠములు, వీనిని హనుమద్భక్తులు దర్శించుట ముఖ్యము. దర్శింపనెంచు వారు పైనగరములకు నేడుకల పేళ్లు విచారించి వెళ్ళనగును. ప్రతి ఉదయము ఈ పుణ్యస్థలములను స్మరించుట కూడ భుక్తి ముక్తి ప్రదము.

* హనుమంతుని వాగ్దానము *

శ్లో॥ ఐహికేషు చ కార్యేషు-మహాపత్సు చ సర్వదా
నైవ యోజ్యో రామ మంత్రః-కేవలం మోక్షసాధకః
ఐహికే స మనుప్రాప్తే మాం స్మరేద్రామ సేవకమ్॥

అని హనుమంతుడు తానుగా రామ రహస్యోప నిషత్తులో చెప్పియున్నాడు. పరమెట్లున్నను ఐహిక జీవితము ముందు చూచుకొనవలె గదాయని కలియుగమున కష్టకాలమున ప్రతివారూ కార్యసాధన కోరుచుందురు. అట్టిది తానే తప్పక నెరవేర్తునని హనుమంతుడే చెప్పుకొన్నాడు. అతని అనుగ్రహమునకు పాత్రులమగుటే మనవంతు, తన రాముని గొప్పగా చెప్పుటకే మోక్షమును రాముని కోరమనెను తప్ప అతడే మోక్షమార్గమును కూడ చూపునని నమ్మవచ్చును. "శ్రీ మారుతేస్సేవన తత్పరాణాం భోగశ్చ మోక్షశ్చకరస్థ యేవ" అని శౌనక సంహితావాక్యమే ప్రమాణము.

## * పొగిడిన పెరిగెడి స్వామి *

హనుమంతునిలో ఒక విశేషముంది. అతనిశక్తి అతనికి తెలియదు. అది శాపము. ఇతరులు పొగిడిన కొలది తన శక్తి చూపుచుండును. అట్లే జాంబవదాదులు పొగిడి పొగిడి అతనిని పెంచి పెంచి సముద్రమును లంఘించినంతగా చేసిరి. కావున మనము హనుమంతు నెంతగా పొగిడినా అంతగా సంతోషించి మనల ననుగ్రహింపగలడు. మనము మైమరచి అతనిని భజించగల్గిన అతడు మైమరచి వరముల కురిపించి మనలను కష్ట సముద్రమును దాటింపగలడు. కావున శక్తియుక్తులన్నిటిని భక్తిలో రంగరించి స్వామి కృప నందుదురు గాక !

## * భవిష్యద్బ్రహ్మ *

హనుమంతుడు రాముని కోర్కెపై ఆతని ముద్రిక తెచ్చుటకు బ్రహ్మలోకమునకు వెడలి ముద్రికనీయనినన బ్రహ్మపై కోపించి విశ్వరూపము చూపెను. ఆ విశ్వరూపముజూచి బ్రహ్మలోకమంతయు నడలగా బ్రహ్మ ముద్రిక నిచ్చెను. దానిని సీతారాముల కందించి సంతోషపరచెను. అప్పుడు ప్రస్తావవశమున బ్రహ్మలోకము తనకు మిక్కిలి ఆనందము కల్గించినట్లు తెల్పెను. అనేకరీతుల తన కానందము కల్గించిన కారణమున రాముడు హనుమంతునకు బ్రహ్మలోకాధిపత్యము ననుగ్రహించెను. ప్రతి కల్పమున

ఒక్కొక్క అంశము చొప్పున బ్రహ్మరూపమందుచు భవిష్యత్కల్పముల ఆతడు బ్రహ్మయగును.

## * అవతారములు *

ప్రసన్నాంజనేయ, వీరాంజనేయ, అభయాంజనేయ, పంచ ముఖాంజనేయా ద్యవతారములు అనేకములున్నవి. అందు ముఖ్యములైన తొమ్మిది ఆయాభక్తులచే ఆరాధింపబడినవి. వానిని నవావతారములందురు. 1. ప్రసన్నాంజనేయావతారము, 2. వీరాంజనేయావతారము 3. వింశతి భుజావతారము 4. పంచముఖాంజనేయావతారము, 5. అష్టాదశభుజావతారము 6. సువర్చలాంజనేయావతారము 7. చతుర్భుజావతారము 8. ద్వాత్రింశ ద్భుజావతారము 9. వానరరూపావతారము

## * సిందూరము—తైలాభిషేకము *

ఒక మంగళవారదినమున ఆకలిగొన్న హనుమంతుడు సీతామతల్లి నేమయిన పెట్టుమని ప్రార్థించి నిరీక్షించుచుండెను. ఆమె స్నానము చేసివచ్చి "తిలకధారణ మొనర్చుకొని పాపట సిందూరము నుంచుకొనెను. హనుమంతుడా సిందూరమెందుకని ప్రశ్నింప నామె, దీనివలన నా స్వామికి ఆయుర్వృద్ధియగుననెను. సిందూర ధారణచే స్వామికి ఆయుర్వృద్ధియగునని విన్న హనుమంతుడు వెంటనే వెడలి యెడ

లంతా సిందూరమలముకొని సభకువచ్చెను. అతనిని చూచి సభ్యులందరు విరగబడి నవ్విరి. కారణమడిగిన రామునకు నీకత్యంతము ఆయుర్వృద్ధి కలగవలెనని యొడలంతట పూసు కొంటినవగా యధార్థ విషయమెఱిగి, హనుమంతుని సరళ భావమునకు ముగ్ధుడై "మంగళవారమునాడు నాకనన్య ప్రీతి పాత్రుడగు హనుమంతున కెవ్వరు తైలము, సిందూరము పూయుదురో వారికి నేను ప్రసన్నుడనై వారికోరికలు తీర్చెదను" అని ప్రకటించెను. కాన హనుమంతునకు సిందూ రము పూయుట విశేషము.

హనుమ దుపాసనా కల్పద్రుమంలో ఆపన్నివార ణార్థం హనుమంతునకు తైలాభిషేకము కర్తవ్యముగా చెప్ప బడినది. అందుకే తైలమిశ్రిత సిందూరలేపనము ముఖ్యముగా చెప్పబడినది.

## * మంగళవార విశిష్టత *

పై గాథయంతయు మంగళవార విశిష్టతకు నిదర్శ నము. కావున మంగళవారమున హనుమంతున కభిషేక మొనర్చి సిందూర తైలలేపన మొనర్చవలెను. మంగళవార మున హనుమంతుని పూజించి అరటిపండు నైవేద్యము పెట్టి వారిని తానను గ్రహింతునని సీతాదేవి చెప్పెను. ప్రతి మంగళవారము సీతాదేవి హనుమంతుని పూజించుచు కష్టముల పోగొట్టుకొనెడిది.

## * శనివార మాహాత్మ్యము *

హనుమంతుడు శనివారము నాడు పుట్టుట వలన ప్రతి శనివారము హనుమత్పర్వదినము. నాడు ఆతనిని విశేషముగ పూజించినను, ఏక భుక్తమాచరించినను అత డనుగ్రహిం చును. ప్రతి శనివారము రాజశ్రేష్ఠుడగు భరతుడు హను మంతుని పూజించుచు ఎనలేని పరాక్రమ మందగలైను. శని వారమున భక్తితో హనుమత్సాలగ్రామమును ప్రత్యేకముగ పూజింతురు. హనుమంతున కిష్టమగు శనివారమున అట్లు పూజించుట వలన హనుమంతు డనుగ్రహించి కోరికల దీర్చు నని పరాశరులవారు తెల్పిరి.

## * శనిపీడా నివారకుడు *

గ్రహచారము బాగుండక బాధపడువా రెందరో యుందురు. అందునా ముఖ్యముగా శని పీడితు లెక్కువ. అతడే నిసర్గ పాపిగా చాల కాలము బాధించువాడు. హనుమ దారాధకులకు శని బాధయుండదు. ఒకప్పుడు శని హనుమం తుని పట్టదెంచి అతని కోపమునకు గురియయ్యెను. అదే సమయమున సేతు ప్రదక్షిణము చేయనున్న హనుమంతుడు శనిని తోకతో చుట్టి వెనుక వ్రేలాడుచుండగా ఈడ్చుకొనుచు సేతు ప్రదక్షిణము జేయుటతో శనియొడలు హూనమై దేహ మంతయు పుండ్లు పడగా హనుమంతుని శరణుజొచ్చెను. అంత హనుమంతుడు తన భక్తుల ఛాశులయందు ప్రవేశించి

నప్పుడు వారిని బాధింపవలదని శాసించి వదలెను. ఆ దేహ బాధను భరింపజాలక శని దేహమంతట తైలము నలదుకొనజొచ్చెను. అందువనే శని తైలాభిషేకము కోరుచుండును. కావున హనుమంతుని సేవించువారికి శనిపీడ యుండదు.

* కదళీవనార్చన *

శ్లో॥ కదళీ వన మధ్యస్థం-పూజయే ద్యః కపీశ్వరం
తస్య పుణ్యఫలం ప్రోక్తం-గుణితం కోటిసంఖ్యయా॥

హనుమత్పూజ అరటితోటలో చేసినచో అది కోటిరెట్ల ఫలితము నిచ్చును. అరటి పూలతోను అరటి అత్తములతోను, అరటి పండ్లతోను అష్టోత్తరశత సహస్రనామ పూజలు చేయుట వానికి మిక్కిలి ఇష్టము. అరటిపండ్లు నివేదనచేయుట కూడా ప్రీతిపాత్రము. **హనుమత్పూజకాని**, యంత్రారాధనము కాని, హృదయముకాని, హనుమత్కవచము కాని, మంత్రముకాని కదళీవనమున జపించుట విశేష ఫలమిచ్చును. సర్వకార్యములు సిద్ధించును.

శ్లో॥ ఆవర్తయన్ త్రివారంతు కదళీవన మధ్యగః
అన్యత్ర శత సాహస్ర కోట్యావృత్తి ఫలం లభేత్॥

అరటితోటల మధ్య ముమ్మారు మంత్రము జపించిన అది ఇతరచోట్ల వందల,కోట్లసార్లు జపించినఫలితమునిచ్చును. (ఇంకను విశేషములు పూజా విధానమున తెలుపబడినవి.) కాన హనుమద్భక్తులు అరటి తోటను పెంచుకొని మధ్య

భాగమున హనుమంతునకు, తనకు చిన్నపీఠము లేర్పరచుకొని అర్చన సేయదగును.

## * నాగవల్లీ దళార్చన *

హనుమంతునకు తమలపాకులతో పూజ ఇష్టము. యథాశక్తిగా సహస్ర నామార్చన, అష్టోత్తరశతము చేయుటయేకాక ఐదుఆకులు సమర్పించినను సంతోషించును. యథావకాశముగా పూలవలె తమలపాకులతో స్వామి నారాధించనగును.

## * పంచ సంఖ్య *

హనుమంతునకైదు సంఖ్య ఇష్టము. కావున హనుమత్ప్రీతి కొఱకై పత్ర, పుష్ప, ఫల, తాంబూలాదులను, అప్పములను పంచ సంఖ్యతో సమర్పింపనగును. ప్రదక్షిణ నమస్కారములు కూడ ఐదేసి చేయుట మంచిది. హనుమత్ప్రీతికై దానములు కూడ పంచ సంఖ్యలోనే చేయనగును.

## * హనుమత్సాలగ్రామము *

హనుమత్సాలగ్రామ పూజ విశేషముగా అనుగ్రహకారి. సాలగ్రామము గుర్తించి దానిని పదిల పరచుకొని యారాధించు కొననగును. హనుమత్సాలగ్రామము శిరస్సు యొక్క కుడివైపు పెద్ద వర్తులాకారపు చక్రముతో కూడి యుండును. ఎడమ వైపున బాణపు దెబ్బతో చేయబడిన ఆవుగిట్ట వంటి లోతగుభాగము కలిగియుండును. సూక్ష్మపంజ

రముతో , మూలికాకారమున వాలముతోను కూడి అనేక శిఖరములు కల్గి సూక్ష్మమగు ధనూరేఖ కల్గియుండును. ముఖ భాగమున చక్రద్వయముకల్గి సూక్ష్మమగు తామరపుష్ప ముతో నున్న ఈ సాలగ్రామము మంత్ర స్వరూపమై జనులకు సర్వసౌభాగ్యములిచ్చు పురుషోత్తముడగు హనుమంతుని రూపము. సాలగ్రామములందిది హనుమంతము.

## * శ్వేతార్కం-శతార్కం *

హనుమంతునకు తెల్లజిల్లేడు చాల ముఖ్యమైనది. వందేండ్లు బ్రతికిన తెల్ల జిల్లేడు మూలముపై హనుమంతుని ఆకార మేర్పడునని, దానినర్చించుట విశేషమని చెప్పుదురు. గాణపత్యమునకూడ ఇట్టివిధానముకలదు. అట్టి శ్వేతార్క శతార్క హనుమంతుని సంపాదించిన మహనీయులున్నారు. తెల్లజిల్లేడు వేరు చెక్కతో హనుమంతుని చేయించి పూజిం చుట విశేషము. అట్లుచేయించి కదళీవనమున ఆ ప్రతిమను పూజించిన సత్వరము హనుమంతు డనుగ్రహించును.

## * పంచముఖ హనుమద్రూపము *

పంచముఖాంజనేయునకు పూర్వముఖము వానరము, దక్షిణము నారసింహము, పశ్చిమము గారుడ ముఖము, ఉత్తరమున వరాహముఖము, ఊర్ధ్వమున అశ్వముఖము.

## * హనుమతేశ్వరుఁడు *

శివార్చనాతత్పరుడగు రావణుని సంహరించినదోషము పోగొట్టుకొనుటకై శ్రీరామచంద్రుఁడు సముద్రప్రాంతముననే శివలింగమును ప్రతిష్ఠింపనెంచి లింగమును తెచ్చుటకై హనుమంతుని కాశికి పంపెను. ముహూర్తము దాటకుండు టకై సీతాదేవిచే చేయబడిన సైకతలింగమును ప్రతిష్ఠించెను. ఇంతలో వచ్చిన హనుమంతుడు తనకుగలిన ఆశాభంగమునకు చింతించ, దానినాతనిచే ప్రతిష్ఠింపజేసెను. రామునిచే ప్రతిష్ఠింపబడిన లింగమే రామేశ్వరము, అదియే రామేశ్వర క్షేత్రము. హనుమంతుడు కాశీనుండి తెచ్చిన లింగమునే హనుమతేశ్వరుడందురు; హనుమతేశ్వర దర్శనము చేయకున్న రామేశ్వర యాత్ర పూర్తికాదని హనుమతేశ్వర దర్శన మవశ్యమని రాముఁ డనుగ్రహించెను. హనుమతేశ్వరుని సహజముగా విశ్వనాథుడని అచ్చట చెప్పుదురు.

## * హనుమత్కుండము *

రామేశ్వరముననే రామేశ్వరాలయమునకు సుమారు మూడు ఫర్లాంగుల దూరమున హనుమత్కుండము కలదు. స్కాంద పురాణమున దీని వైభవము చాలా గొప్పగా చెప్పబడినది. అదియే హనుమన్నిత్య నివాస మగు గంధ మాదన పర్వత ప్రదేశము. హనుమత్కుండము అపుత్రు లకు పుత్రప్రదమని ధర్మ సఖోపాఖ్యానము చాటుచున్నది.

అపుత్రులకు పుత్రప్రదమని పుత్రవంతులకు ఐశ్వర్యప్రదమని సరు లకు సర్వాభీష్టదాయకమని చెప్పబడుచున్నది. హనుమంతుడు తన పేర నిర్మించిన హనుమత్కుండమున స్నానమాడి పునీ తులగుట హనుమద్భక్తులకర్తవ్యం. కొద్దిదూరముండుటవలన పండాలు యాత్రికులకు హనుమత్కుండ దర్శన భాగ్యము కల్గింపరు. కాన ప్రయత్నపూర్వకముగ అడిగి తెలిసికొని రామేశ్వరయాత్రికులు హనుమత్కుండాన స్నానమాడదగును.

ఆ ప్రదేశమున రహదారికి ఒక వైపున ఇసుక చాల తెల్లగాను, వేఱొక వైపున మిక్కిలి ఎఱ్ఱగాను ఉండుట గమనింపవచ్చును. ఆ ఎఱ్ఱని భూభాగమును హనుమంతుడు సైకతలింగమును పెకలింపజూచినప్పుడు రక్తసిక్తమైనదానినిగా చెప్పుదురు.

## హనుమత్ప్రదక్షిణములు

భూత, ప్రేతపిశాచాది బాధలు తొలగుటకు రోగ ములు, ఎట్టికష్టములైన తొలగుటకు, అభీష్ట సిద్ధికి ఆంజనేయ ప్రదక్షిణములు సుప్రసిద్ధములు. అనేకులు ఆ ప్రదక్షిణముల వలన ప్రత్యక్షఫలము పొందుచున్నారు. ప్రదక్షిణములకునియమములు ముఖ్యములు. దేవాలయమునందుకాని, లేదా హనుమంతుని యంత్రమును వేయించుకొని దానిచుట్టు ఇంటి వద్దనైన ప్రదక్షిణము చేయవచ్చును, గణనమునకై పసుపుకొమ్ములు వాడుట శ్రేయము. మిరియములు ఉగ్రవిషయములు కాన పసుపుకొమ్ములే వాడుటమంచిది, పుష్పాదికమును; వక్కలను గణనకు తీసికొని గణనచేయవచ్చును.

"శ్రీ హనుమన్ జయహనుమన్ జయజయ హనుమన్"

శ్లో॥ ఆంజనేయం మహావీరం బ్రహ్మవిష్ణుశివాత్మకం
తరుణార్క–ప్రభం శాంతం రామదూతం–నమామ్యహమ్॥

శ్లో॥ మర్కటేశ మహోత్సాహ సర్వశోక వినాశన
శత్రూన్సంహర మాంరక్ష శ్రియందాపయ–మే ప్రభో!"

అని పఠించుచు ప్రదక్షిణములు చేయవలెను. భక్తి శ్రద్ధలతో చేతులుజోడించుకొనిగణనమునకుపకరించు పుష్పాదులను చేతియందుంచుకొని నమ్రులై పరుగులిడక ప్రదక్షిణలు చేయవలెను. మధ్యలో మాటాడరాదు, స్నానాదికము నిర్వహించి శుచులై చేయవలెను, నూట ఎనిమిది కాని, శక్తిలేనివా రందు సగముకాని, ఇంకను శక్తిహీను లందు సగమైన చేయవచ్చును, అట్లు శక్తిననుసరించి నలుబది ఐదు దినములు కాని, ఇరువదియొక్క దినములుకాని, అభీష్టము ప్రబలమగుచో బహు దినములు, బహు నియమములు తప్పక పాటింపనగును. అభీష్ట మల్పమగుచో కొద్దికాలము చేయవచ్చును. అభీష్టము కలవారు స్వయముగా ప్రదక్షిణములు చేయవలెను. వారశక్తులైనచో తమ కొఱకై అన్యుల చేతనయినా చేయింపవచ్చును. ప్రదక్షిణము చేయుట ఇంటియందైనచో దీపారాధన చేసికొని చేయుదురు, దేవాలయమందయిన దీపారాధనచేసికొని లేదా దేవునికడయున్న

దీపారాధనయందు తైలమువేసి నమస్కరించుకొని ఆరంభింప వలెను. నిత్యము శిరస్నానము కర్తవ్యము. ప్రదక్షిణములు పూర్తియైన పిదప "మయాకృతై రేభిః ప్రదక్షిణైః శ్రీ సువర్చలా సమేత హనుమాన్ సుప్రీత సుప్రసన్నో వరదో భూత్వా మమాభీష్ట సిద్ధిం దదాతు" అని జలమును విడువవలెను.

దేవాలయమునందు చేయనివారు స్వామి యంత్రమును అశ్వత్థ మూలమునకాని, కదళీ మూలమునకాని, మారేడు, ఉసిరి లేదా తులసి చెట్టు మొదటనయినా కాని, లేక తమ యింట పరిశుద్ధ ప్రదేశమున కాని యంత్రమునుంచి ప్రదక్షిణములు చేయవలెను.

ప్రదక్షిణములు చేయుకాలమున బ్రహ్మచర్యము, అధశ్శయ్య, నిత్యము దేవపూజ, మౌనవ్రతం ఏకభుక్త నియమము కోపమువీడుట, దైవము యెడ అచంచల భక్తి యున్నవి ముఖ్యనియమములు. ఇంద్రియ వికారముల కవకాశమీయక మృదువైనవి, కొద్దిమాత్రము వేడికలవి, బాగుగ వండినవి యగు సాత్వికపదార్థములను లఘువుగ భుజింపవలెను. భక్తిలోపము తగదు. శక్తి వంచన కూడదు, అశక్తులు యథాశక్తి నియమములు పాటించి స్వామి యనుగ్రహమునకు పాత్రులు గావచ్చును.

దక్షిణాభిముఖుడైన హనుమంతుడు శక్తివంతుడుగా

పెద్దలు చెప్పుదురు. అట్టి స్వామి నారాధించి నిర్వహించుట సద్యః ఫల మీయవచ్చు.

* సుందర కాండ *

శ్రీమద్వాల్మీకి రామాయణాంతర్గతమైన సుందరకాండ భక్తులపాలిటి కల్పవృక్షమన్న అతిశయోక్తి కాదు, అనాదిగా నెట్టి యభీష్టములతోనయిన సుందరకాండ పారాయణ మొనర్చి కోర్కెలను నెరవేర్చుకొనుచున్నారు. పారాయణమునందనేక విధానములు కలవు. గ్రంథ విస్తరణ భీతిచే వాటినన్నిటి నిచ్చుట నిచ్చుటలేదు. కార్యసిద్ధి దుష్టగ్రహ,పిశాచిక బాధా నివారణ, బంధవిముక్తి, దుస్స్వప్ననాశ, శోకనాశ రాజ్య లాభ, తాపత్రయ నివారణ, సంపత్సుఖాదుల నెన్నిటినో అనంతములగు ఫలితములను భక్తులు సుందరకాండ పారాయణ వలన పొందుచున్నారు. పారాయణము స్వయముగా చేసికొన వచ్చును లేదా వేరొకరిచే చేయించవచ్చును. సుందరకాండ మొత్తమేకాక ప్రతిసర్గ ప్రతిశ్లోకము కూడ ప్రత్యేక శక్తి కల్గి అనుగ్రహాకారులై యున్నవి. సుందరకాండయొక్క సర్వఫలితముల దెల్పుట అసాధ్యము కాన మానవు లనుభ వించు దుఃఖములకు తరుణోపాయముగా కొన్నిదోష శాంతులు మాత్రము తెలుపబడుచున్నవి.

* గ్రహదోష శాంతులు *

శనిగ్రహము మహార్దశయందుకాని, అంతర్దశయందు

కాని, గోచారమునగాని కష్టకారకుడై యున్నచో హను మంతుడు బ్రిహ్మాస్త్రమునుండి విముక్తుడైన గాథకల సుందర కాండ 48వ సర్గ పఠింపవలెను.

48వ సర్గ పారాయణ మొనర్చుచో ప్రతి శనివారము హనుమంతునకు రుద్రసూక్తముతో తైలాభిషేక మొనర్ప వలెను. నల్ల వంకాయలు దానమీయవలెను. ఈ రీతిగ దోషమున్నంతకాలము కాని, అశక్తులు కనీస మైదు శని వారములైన తైలాభిషేకదానము లొనర్చవలెను. ప్రతి శనివారము ఆవునేయి (దొరకనిచో మామూలునేయి) నువ్వులనూనె, ఆముదము ఈ మూటిని మిశ్రమము చేసి రాగిపాత్రలో దీపారాధన చేయవలెను. ఇట్లు చేసిన హను మంతు డనుగ్రహించి శని దోషము పోగొట్టి శుభము లొసంగును.

శని మహర్దశలో రాహ్వంతర్దశ చెడుగనున్న హను మంతుడు అక్షయకుమారుని సంహరించిన సుందరకాండ 47వ సర్గ పారాయణ చేయవలెను.

శనిమహర్దశలో శుక్రాంతరము చెడుగానున్న సీతా దేవి హనుమంతునకు చూడామణి నిచ్చిన సుందరకాండ 38వ సర్గ పఠించవలెను.

* చంద్రదశా దోషమునకు *

చంద్రదశా దోషమునకు శుక్లపక్ష ప్రదోషమున

చంద్రుని పూజించుచు రాత్రియందు సుందరకాండ 5వ సర్గను పారాయణ మొనర్చవలెను.

* కుజమహర్దశలో గుర్వంతర దోషమునకు *

కుజమహర్దశయందు గుర్వంతర్దశ దోషమై యున్న హనుమంతుడు రావణున కుపదేశ మొనర్చిన సుందరకాండ 57వ సర్గను పారాయణ మొనర్చవలెను.

* కుజదశయందు శుక్రాంతర దోషమునకు *

కుజమహర్దశయందు శుక్రాంతర్దశదోషముగానున్న సీతాదేవి హనుమంతునికొరకు అగ్నిదేవుని ప్రార్థించిన సుందరకాండ 53వ సర్గ పారాయణ చేయవలెను.

* రాహుదశలో శుక్రాంతరదోషమునకు *

రాహుమహర్దశయందు శుక్రాంతర్దశ దుష్టమైయున్న హనుమంతుడు శ్రీరామునకు చూడామణి నొసంగిన సుందర కాండ 65వ సర్గ పారాయణ మొనర్చవలెను.

* గురుదశా దోషమునకు *

గురుమహర్దశ దోషగ్రస్తమైయున్నచో హనుమం తుడు సముద్రమును దాటిన సుందరకాండ 1వ సర్గ పఠించి పారాయణ అనంతరము పంచదారతో కూడిన పేలాలను నివేదించవలెను.

*  గురుదశలో కేత్వంతర దోషమునకు  *

గురుమహర్దశయందు కేత్వంతర్దశ చెడుగానున్న హనుమదాదులు మధువనమును ధ్వంసముగావించిన కథ కల సుందరకాండ 61, 62 సర్గలు పారాయణ చేయవలెను.

*  బుధ దశా దోషమునకు  *

బుధ దశ పీడగానున్న సీతాదేవి యెదుట శ్రీరాముని హనుమంతుడు వర్ణించిన 35వ సర్గను పఠించి పిదప రాముని పూజించి రామునకు పులగము నివేదించవలెను.

బుధ దశయందు కుజాంతర్దశ నష్టదాయకమైయున్న సీతాదేవికి శుభశకునములు కల్గిన సర్గ నారు మారులు పఠింపవలెను.

బుధ మహర్దశయందు కేత్వంతర్దశ చెడుగనున్న హనుమంతుడు అశోకవనమున సీతాదేవిని వెదకిన 15వ సర్గను పఠింపవలెను.

*  శని దశలో బుధాంతర దోషమునకు  *

శనిమహర్దలో బుధాంతరము చెడుగానున్న హనుమంతుడు లంకాదహన మొనర్చిన 54వ సర్గ పారాయణము చేయవలెను.

*  శుక్రదశా దోషమునకు  *

శుక్రదశ చెడుగానున్న హనుమంతుడు సీతాదేవికి

రామముద్రికనిచ్చిన కథ కల 38వ సర్గ పఠించి సీతాదేవిని పూజింపవలెను.

* కేతుదశయందు శుక్రాంతర దోషమునకు *

కేతుమహర్దశయందు శుక్రాంతరము దోషముగా నున్న హనుమంతుడు సీతను చూచిన గాథను రామునకు చెప్పిన కథగల సుందరకాండ 65వ సర్గ పఠింపవలెను.

* ఉన్మాదమునకు శాంతి *

ఉదయకాలమున మినుమపప్పును బాగుగా విసిరి నూకచేసి అన్నముగావండి శ్రీ స్వామివారికి నివేదనచేసి హనుమద్విషాదకరమగు సుందరకాండ 13వ సర్గను పారాయణ చేయవలెను. దానిచే మనస్థిమితము లేకపోవుట, దిగులు, పిచ్చి, మున్నగు మానసిక వ్యాధులు తొలగును.

* దారిద్ర్య దోష శాంతి *

దారిద్ర్య విమోచనమునకై హనుమంతుడు సీతను చూచిన సుందరకాండ 15వ సర్గ పారాయణ చేయవలెను.

తప్పిపోయినవారు చేరుటకు

తప్పిపోయినవారు, విరోధమందినవారు మరల కలియుటకు హనుమంతుడు రామముద్రికను సీతాదేవికిచ్చిన 36వ సర్గను త్రికాలములందు పఠించి పఠనమునకు ముందు, తరువాత కూడ పనస, లేదా మామిడి, ఫలములను లేదా సమకూడిన ఫలములను నివేదించవలెను.

## * దుస్స్వప్న శాంతి *

దుస్స్వప్న దోషశాంత్యర్థము త్రిజటా స్వప్న వృత్తాంతము కల సుందరకాండ 27వ సర్గ పఠించి శర్కరను నివేదించవలెను.

## * రోగనాశకుడు హనుమంతుడు *

చిరంజీవియైన హనుమంతుని స్మరణే అకాలమృత్యువు నుండి కాపాడుతుంది. సంజీవినీపర్వతాన్ని తెచ్చిన హనుమంతుడు అనుగ్రహించిన రోగబాధే ఉండదు. రోగబాధ నుండి రక్షింపబడుటకై

శ్లో॥ హనూమానంజనీసూనో వాయుపుత్రో మహాబలః
అకస్మాదాగతోత్పాతం నాశయాశు నమోஉస్తుతే॥

అను శ్లోకమునుగాని,

"నాసై రోగహరై సబపీరా జపత నిరంతర హనుమతవీరా"

అను వాక్యములనుగాని పలుమార్లు జపించి రోగముల నుండి విముక్తులగువారనేకులు కలరు.

## * హనుమంతుడు వేదవాచ్యుడు *

వేదవాచ్యులైన దైవములనే ప్రామాణికములుగా అంగీకరించు పద్ధతులున్నవి. ఏలనన అనాది వాక్యమగు శ్రుతిని మించిన ప్రమాణము వేరు లేదు. అట్టి వేదమున కూడ హనుమంతుని గూర్చి పలురీతుల కలదు. ఋక్సం

హితలో హనుమత్పరములై తెలియు బుక్కు లనేకము లున్నవి. వేదాంతములగు ఉపనిషత్తు లనేకములందు హనుమద్విషయము కలదు. అధర్వణ వేదీయమైన హనుమత్తాపనీయోపనిషత్ పూర్తిగా హనుమత్పరమైయున్నది.

ఇంకను రామరహస్యోపనిషత్తు రామపూర్వోత్తర తాపిన్యుపనిషత్తు, యజుర్వేదీయమైన ముక్తికోపనిషత్తు వంటి వానియందు హనుమత్ప్రసక్తి యుండుటవలన హనుమంతుడు వేదవాచ్యుడగుట స్పష్టము.

* విదేశాలలో కూడ హనుమంతుడు *

అనాదిగా అనేక దేశములలో హనుమద్ధ్వజాలు, హనుమన్మందిరాలు, హనుమాన్ చాలీసావంటి పఠనాలు జరుగుచునేయున్నవి. మారిషస్‌లోని గ్రామములలో, పట్టణములలో కూడా అనేక నిలయములపై కాషాయవర్ణముగల హనుమత్పతాకలు దర్శనమిచ్చును. హనుమంతుని బలిష్టమైన ఆకారముల విగ్రహములు, చిత్రములు అనేక మందిరములలో కానవచ్చును. థాయ్‌లండ్, బర్మా, కంబోడియా లాఓస్, మలేసియాలలో కూడ అనేక తావులందు హనుమంతుడు దర్శనమిచ్చును. రామాయణ గాథలు విన్పడును. కారణాంతరముల వలన గాథలలో తేడాలు మాత్రము కానవగును. థాయ్‌లండ్, కంబోడియా, లాఓస్, ఇండో

నేసియాలలో శ్రీరామలీల నృత్యనాటికలు ప్రదర్శింపబడు చున్నవి. అందు హనుమంతుడు వానర రూపమున రాముని సైనికునిగ, తేజస్విగ, ఓజస్విగా కాననగును. కంబోడియాలో అంగకోర, ఇండోనేషియాలో ప్రాంబానన్, థాయ్‌లాండ్ బౌద్ధ మందిరాల గోడలపై హనుమంతుని స్వరూపములు కానవచ్చును. ప్రవాస భారతీయులు కూడా తమ మందిరము లందు హనుమంతుని ప్రతిష్ఠించుకొనుచున్నారు. అమెరికా, ఇంగ్లండు వంటి దేశములందును భారతీయుల రాకపోకల వలన ధార్మిక సంస్థల వలన అనేక తావులందు హనుమ ద్విగ్రహములు వెలయుచు హనుమదారాధనలు జరుగు చున్నవి.



# శ్రీ పరాశర సంహితా

శ్రీరాముని చరిత్రకు రామాయణమెట్లో, శ్రీకృష్ణ చరిత్రకు భాగవతమెట్లో, శ్రీ హనుమచ్చరిత్రకు పరాశర సంహిత అట్లు శరణ్యమైనది. కావున ప్రతి భక్తుడు తప్పక చదివి అందలి హనుమద్విషయములన్నిటిని తెలిసికొననగును. అది హనుమద్విషయ సర్వస్వము. శ్రీమద్రామాయణమునందున్నదే హనుమంతుని గాథ యనుకొందుము. కాని అంతకు మించిన విశేషగాథ పరాశరసంహితయందే కాననగును. అంతేకాక హనుమత్సంబంధమైన మంత్ర భాగము, తంత్రభాగము, వివిధ స్తోత్రములు, జలస్తంభన, అగ్నిస్తంభన, వాయుస్తంభనాది విద్యలు ఒకటననేల? సర్వ విషయములు అందు కలవు. శ్రీ హనుమత్సేవాసమితి, సత్యనారాయణపురం, విజయవాడవారిప్పటికి ఆ గ్రంథమును 13భాగములుగాముద్రించిరి. ఇంకను రెండు రెట్లకుపైగా ఆ గ్రంథము కలదని తెలియుచున్నది. ఇంతకాలముగా వ్రాతప్రతులలో మగ్గుచున్న ఆ విషయమును శోధించిసామాన్యుల కర్థమగునట్లు తెనుగుభావముతో అందించుటజరుగుచున్నది. హనుమంతునకుసంబంధించిన ప్రతిప్రశ్నకు ఆ గ్రంథమే ఏకైక సమాధానము కాగలదు. కొనలేనివారు కొనిన వారికడ తీసికొనియైన తప్పక చదివి హనుమంతుని సంపూర్ణ చరిత్రను, అనేక విశేషములను తెలిసికొనుట ఎంతయు నావశ్యము.

— ఓమ్ —



శ్రీ ఆంజనేయ రక్ష - అఖిలజగద్రక్ష

# 2. ధ్యాన విభాగము

## * శ్రీ ఆంజనేయ సుప్రభాతము *

శ్లో॥ అమల కనకవర్ణం ప్రజ్వల త్పావకాక్షం
సరసిజనిభవక్త్రిం సర్వదా సుప్రసన్నం
పటుతర ఘనగాత్రం కుండలాలంకృతాంగం
రణజయకరవాలం రామదూతం నమామి ॥

అంజనా సుప్రజా వీర పూర్వా సంధ్యా ప్రవర్తతే
ఉత్తిష్ఠ హరిశార్దూల కర్తవ్యం దైవమాహ్నికం
ఉత్తిష్ఠోత్తిష్ఠ హనుమన్ ఉత్తిష్ఠ విజయ ధ్వజ
ఉత్తిష్ఠ రవిజాకాంత త్రైలోక్యం మంగళం కురు ॥

శ్రీరామచంద్ర చరణాంబుజ మత్తభృంగ
శ్రీరామ మంత్రజప శీల భవాబ్ధిపోత
శ్రీజానకీ హృదయ తాప నివార మూర్తే
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

శ్రీరామదివ్య చరితామృత స్వాదలోల
శ్రీరామకింకర గుణాకర దీనబంధో
శ్రీరామభక్త జగదేక మహోగ్ర శౌర్య
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

సుగ్రీవ మిత్ర కపిశేఖర పుణ్యమూర్తే
సుగ్రీవ రాఘవ సమాగమ దివ్యకీర్తే
సుగ్రీవ మంత్రివర శూరకులాగ్రగణ్య
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

భక్తార్తి భంజన దయాకర యోగివంద్య
శ్రీకేసరీ ప్రియతనూజ సువర్ణదేహ
శ్రీ భాస్కరాత్మజ మనోంబుజ చంచరీక
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

శ్రీ మారుత ప్రియతనూజ మహాబలాఢ్య
మైనాక వందిత పదాంబుజ దండితారిన్
శ్రీ ఉష్ట్రవాహన సులక్షణ లక్షితాంగ
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

పంచాననస్య భవభీతిరహస్య రామ
పాదాబ్జసేవనపరస్య పరాత్పరస్య
శ్రీ అంజనా ప్రియసుతస్య సువిగ్రహస్య
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

గంధర్వ యక్ష భుజగాధిప కిన్నరాశ్చ
ఆదిత్య విశ్వ వసురుద్ర సువర్షి సంఘాః
సంకీర్తయంతి తవ దివ్య సునామపంక్తిం
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

శ్రీ గౌతమీ చ్యవన తుంబుర నారదాత్రి
మైత్రేయ వ్యాస జనకాది మహర్షి సంఘాః
గాయంతి హర్ష భరితా స్తవ దివ్యకీర్తిం
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

భృంగావళీ చ మకరందరసం పిబేద్వై
కూజం త్యుతా ర్ధమధురం చరుణాయుధాశ్చ
దేవాలయే ఘన గభీర సుశంఖఘోషాః
నిర్యాంతి వీరహనుమన్ తవ సుప్రభాతమ్॥

పంపాసరోవర సుపుణ్య పవిత్ర తీర్థ
మాదాయ హేమకలశైశ్చ మహర్షి సంఘాః
తిష్ఠంతి త్వచ్చరణపంకజ సేవనార్థం
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

శ్రీసూర్యపుత్రి ప్రియనాథ సునోజ్ఞమూర్తే
వాతాత్మజా కపివీర సుపింగళాక్ష
సంజీవరాయ రఘువీర సుభక్తవర్య
శ్రీవీర ధీర హనుమన్ తవ సుప్రభాతమ్॥

## మంగళాష్టకమ్

శ్లో॥ వైశాఖేమాసి కృష్ణాయాం దశమ్యాం మందవాసరే
పూర్వాభాద్రా ప్రభూతాయ మంగళం శ్రీహనూమతే॥

కరుణారసపూర్ణాయ ఫలాపూప ప్రియాయ చ ।
మాణిక్యహారకంఠాయ మంగళం శ్రీ హనూమతే ॥
సువర్చలాకళత్రాయ చతుర్భుజధరాయ చ ।
ఉష్ట్రారూఢాయ వీరాయ మంగళం శ్రీ హనూమతే ॥
దివ్యమంగళ దేహాయ పీతాంబరధరాయ చ ।
తప్తకాంచనవర్ణాయ మంగళం శ్రీ హనూమతే ॥
భక్తరక్షణ శీలాయ జానకీ శోకహారిణే ।
జ్వలత్పావకనేత్రాయ మంగళం శ్రీ హనూమతే ॥
పంపాతీరవిహారాయ సౌమిత్రి ప్రాణదాయినే
సృష్టికారణభూతాయ మంగళం శ్రీ హనూమతే ॥
రంభావన విహారాయ గంధమాదనవాసినే ।
సర్వలోకైకనాథాయ మంగళం శ్రీహనూమతే ॥
పంచాననాయ భీమాయ కాలనేమి హరాయ చ ।
కౌండిన్యగోత్ర జాతాయ మంగళం శ్రీ హనూమతే
ధన్యోఽహంకృతకృత్యోఽహం
పుణ్యోఽహం వాయునందన
అద్య మే సఫలం జన్మ
భవత్పాదాబ్జవందనాత్ ॥

## * హనుమత్స్మరణ *

సర్వదేవాత్మకుడగు హ ను మ ం తు ని ఆరాధనకై ముందుముం దనేకవిధములు చెప్పబడినవి. భ క్త సులభుడగు హనుమంతుని ఆయా కష్టసుఖములం దొక్కమారు స్మరించుటకై ఈ ప్రార్థనాశ్లోకము లీయబడినవి. శ్రద్ధతో వీనిని పలుమార్లు ధ్యానించి మంత్రము ననుష్ఠించి అంతట ఫలితమునుకూడ పొందవచ్చును.

## * సర్వకార్యసాధక ధ్యానము *

శ్లో॥ అసాధ్యసాధక స్వామిన్ - అసాధ్యం తవ కిం వద
రామదూత! కృపాసింధో!- మత్కార్యం సాధయప్రభో!

## * సర్వానుగ్రహ ధ్యానము *

శ్లో॥ బుద్ధి ర్బలం యశో ధైర్యం
నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వంచ
హనుమత్స్మరణాద్భవేత్ ॥

శ్లో॥ ఆయుః ప్రజ్ఞా యశో లక్ష్మీః
శ్రద్ధా పుత్రాః సుశీలతా
ఆరోగ్యం దేహి సౌఖ్యం చ
కపినాథ నమోస్తు తే ॥

* శత్రుంజయ ధ్యానము *

శ్లో॥ మర్కటేశ ! మహోత్సాహ !
సర్వశత్రు నివారక !
శత్రూన్ సంహార మాం రక్ష
శ్రియం దాపయ హే ప్రభో!

* పంచముఖ ధ్యానము *

శ్లో॥ పంచాస్య మచ్యుత మనేక విచిత్ర వీర్యం
శ్రీ శంఖ చక్ర విధృతం కపిరాజవర్యం
పీతాంబరాది మకుటై రుపశోభితాంగం
పింగాక్ష మాద్య మనిశం మనసాస్మరామి ॥

శ్లో॥ వందే వానర నారసింహ ఖగరాట్
క్రోడాశ్వవక్త్రాంచితం
నానాలంకరణం త్రిపంచనయనం
దేదీప్యమానం రుచా
హస్తాబ్జై రసి ఖేట పుస్తక సుధా
కుంభం కుశాద్రీ హలం
ఖట్వాంగం ఫణి భూరుహం దశభుజం
సర్వారి గర్వాపహమ్

* సువర్చలా హనుమ ధ్యానము *

శ్లో॥ సువర్చలాధిష్ఠిత వామ భాగం
వామేతరస్థం కపిబృంద సేవితం

స్వపాదమూలం భజతాం నరాణాం
అభీష్టదం శ్రీ హనుమంత మీడే

## * అనన్యకై ంకర్య ధ్యానము *

శ్లో॥ ఏకో దేవ స్సర్వద శ్రీ హనూమన్
ఏకో మంత్ర శ్శ్రీహనూమ త్ప్రకాశః
ఏకా మూర్తిః శ్రీ హనూమ త్స్వరూపా
చైకం కర్మ శ్రీ హనూమత్సపర్యా

## * కో విచారః? కుతో భయం? *

శ్లో॥ హనుమాన్ కల్పవృకో మే–హనుమాన్ మమకామధుక్
చింతామణి స్తు హనుమాన్–కో విచారః? కుతోభయం?

## * చతుర్భుజ హనుమద్ధ్యానము *

శ్లో॥ ఏకేనాఽభయదం పరేణ వరదం భోజ్యం పరంచాఽపరే
అన్యేనాపి సువర్చలా కుచయుగం హస్తేన సంబిభ్రతః
కారుణ్యామృతపూర్ణలోచనయుగం పీతాంబరాలం కృతం
రమ్యం వాయుసుతం చతుర్భుజయుతంధ్యాయే
హనూమత్ప్రభుమ్॥

## * వింశతిభుజ హనుమధ్యానము *

శ్లో॥ ఖడ్గం, ఖేటక, భిండి వాల, పరుశుం
పాశ, త్రిశూల, ద్రుమాన్
చక్రం, శంఖ, గదా, ఫలాం కుశ, సుధా
కుంభాన్, హలం, పర్వతం

టంకం, పుస్తక, కార్ముకాహి డమరూ
నేతాని దివ్యాయుధా
న్యేవం వింశతి బాహుభిశ్చ దధతం
ధ్యాయే హనూమ త్ప్రభుమ్॥

* ప్రసన్నాంజనేయధ్యానము *

శ్లో॥ ఆంజనేయ మతిపాటలాననం
కాంచనాద్రి కమనీయ విగ్రహం
పారిజాత తరుమూల వాసినం
భావయామి పవమాన నందనమ్॥

* వీరాంజనేయ ధ్యానము *

శ్లో॥ మనోజవం మారుతతుల్యవేగం
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథ ముఖ్యం
శ్రీరామదూతం శిరసానమామి

శ్లో॥ ఉష్ట్రారూఢ! సువర్చలా సహచర
స్సుగ్రీవ మిత్రాంజనా
సూనో! వాయుకుమార! కేసరి తనూ
జాక్షాది దైత్యాంతక!
సీతాశోకహరాగ్ని నందన! సుమి
త్రా సంభవ ప్రాణద!
శ్రీభీమాగ్రజ! శంభుపుత్ర! హనుమ
న్పంచాస్య తుభ్యం నమః।

## * ఆపన్నివారక ధ్యానము *

శ్లో॥ ఉల్లంఘ్య సింధో స్సలిలం సలీలం
యశ్శోకవహ్నిం జనకాత్మజాయాః
ఆదాయ తేనైవ దదాహ లంకాం
నమామి తం ప్రాంజలి రాంజనేయమ్॥

## * సర్వాంగరక్షక ధ్యానము *

శ్లో॥ ఆపాదమస్తకం పాతు రామదూతో మహాబలః
పూర్వే వానర వక్త్రో మా మాగ్నేయ్యాం క్షత్రియాంతకృత్
దక్షిణే నారసింహ స్తు నైరృత్యాం గణనాయకః
వారుణ్యాందిశి మా మవ్యా త్ఖగవక్త్రో హరీశ్వరః
వాయవ్యాం భైరవముఖః కౌబేర్యాం పాతుమాం సదా
క్రోడాస్యఃపాతుమాం నిత్య మీశాన్యాం
రుద్రరూపధృత్
ఊర్ధ్వం హయాననః పాతు-
అధః శేషముఖ స్తథా
రామాస్యః పాతు సర్వత్ర
సౌమ్యరూపీ మహాభుజః ॥

## * రోగహరాంజనేయధ్యానము *

శ్లో॥ సంజీవపర్వతోద్ధార!-మనోదుఃఖం నివారయ
ప్రసీద సుమహాబాహో-త్రాయస్వ హరిసత్తమ॥

## * యోగాంజనేయ ధ్యానము *

శ్లో॥ వామేజానుని వామబాహు మపరంజ్ఞానాఖ్య ముద్రాన్వితం
హృద్దేశే కలయన్నతో మునిగణై రధ్యాత్మతత్వేక్షణం
ఆసీనః కదలీవనే మణిమయే బాలార్కకోటిప్రభః
ధ్యాయ న్బ్రహ్మ పరం కరోతు మనసా శుద్ధిం హనూమాన్మమ

## * సంతానహనుమద్ధ్యానము *

శ్లో॥ అంజనాసుత! దేవేశ! కేసరిప్రియనందన!
దేహి మే తనయం శీఘ్రం-సర్వభాగ్య నిధిం ప్రభో!

శ్లో॥ ప్రాలేయ ద్యుతి బింబకోటిరుచిర ప్రస్పర్థి దేహప్రభం
భాస్వద్రత్నకిరీట మండలమణి వ్యాకీర్ణ గండస్థలం
వామే వ్యాధిభి రౌషధం నిగళభిన్నం తత్కరే దక్షిణే
బిభ్రాణం హను మంతముజ్జ్వల తటత్కోటిప్రభంసంశ్రయే

## * నవావతారధ్యానము *

శ్లో॥ ఆద్యః ప్రసన్నహనుమాన్-ద్వితీయో వీరమారుతిః
తృతీయో వింశతిభుజః చతుర్థః పంచవక్త్రకః
పంచమోఽష్టాదశభుజః-శరణ్యస్సర్వదేహినాం
సువర్చలాపతి షష్ఠః-సప్తమస్తు చతుర్భుజః

అష్టమః కథితః శ్రీమాన్-ద్వాత్రింశద్భుజమండలః
నవమో వానరాకారః-ఇత్యేవం నవరూపధృత్
హనుమాన్ పాతు మాం నిత్యం-సర్వసంపత్ప్రదాయకః॥

## * త్రికాలధ్యానము *

ప్రాతః స్మరణ :

ప్రాతఃస్మరామి హనుమంత మనంతవీర్యం
శ్రీరామచంద్ర చరణాంబుజ చంచరీకం
లంకాపురీదహన నందిత దేవబృందం
సర్వార్థ సిద్ధి సదనం ప్రథితప్రభావమ్॥

మాధ్యాహ్నికస్మరణ :

మాధ్యం నమామి వృజినార్ణవ తారణైక-
ధారం శరణ్య ముదితానుపమ ప్రభావం
సీతాఽఽధిసింధు పరిశోషణ కర్మదక్షం
వందారుకల్పతరు మవ్యయ మాంజనేయం॥

సాయంస్మరణము :

సాయం భజామి శరణోపశ్రు తాఖిలార్తి-
పుంజప్రణాశన విధా ప్రదితప్రతాపం
అక్షాంతకం సకలరాక్షసవంశ ధూమ-
కేతుం ప్రమోదిత విదేహసుతం దయాలుమ్॥

* హనుమత్ప్రదక్షిణ ధ్యానము *

"శ్రీ హనుమన్ జయహనుమన్ జయ జయ హనుమన్"

శ్లో॥ ఆంజనేయం మహావీరం-బ్రహ్మవిష్ణు శివాత్మకం
తరుణార్క ప్రభం శాంతం-రామదూతం నమామ్యహమ్

శ్లో॥ మర్కటేశ మహోత్సాహ-సర్వశోక వినాశన
శత్రూన్సంహార మాంరక్ష-శ్రియం దాపయ మే ప్రభో!

* నమస్కార ధ్యానము *

శ్లో॥ నమస్తే స్తు మహావీర నమస్తే వాయునంధన,
విలోక్య కృపయా నిత్యం త్రాహి మాం భక్తవత్సల!

* స్వప్నాంజనేయ ధ్యానము *

శ్లో॥ సమాగతానాగత వర్తమాన
వృత్తాంత విజ్ఞానభరా త్రిలోక్యాః
దూరశ్రుతిం దూర గతి స్సదృష్టిం
స్వప్నే హనూమాన్ మమ దేహి నిత్యమ్ ॥

* ప్రయాణాది సర్వకాల ధ్యానము *

శ్లో॥ హనుమా నంజనాసూనుః-వాయుపుత్రో మహాబలః
రామేష్టః ఫల్గుణసఖా-పింగాక్షో ఽమితవిక్రమః॥

శ్లో॥ ఉదధిక్రమణ శ్చైవ-సీతాశోకవినాశనః
లక్ష్మణప్రాణదాతా చ-దశగ్రీవస్య దర్పహా॥

శ్లో॥ ఏవం ద్వాదశనామాని-కపీంద్రస్య మహాత్మనః
స్వాపకాలే ప్రబోధేచ యాత్రా కాలేచ యః పఠేత్॥

శ్లో॥ తస్య సర్వభయం నాస్తి-రణే చ విజయీ భవేత్
రాజద్వారే గహ్వరేచ-భయం నాస్తి కదాచన॥

* అభయాంజనేయధ్యానము *

శ్లో॥ శ్రీరామ హృదయానందం-భక్తకల్ప మహీరుహం
అభయం వరదం దోర్భ్యాం-కలయే మారుతాత్మజమ్॥

* పరమాత్మ రూపధ్యానము *

శ్లో॥ త్వామామనంతి శ్రుతయః పురుషం ప్రకృతేః పరం
మహదాది వికారేభ్యో వివిక్తమపి మారుతిమ్॥

శ్లో॥ అకర్తార మభోక్తారం అసంగం పరమేశ్వరం
సత్యసంధం మహాసత్త్వం భక్తాధీనం దయానిధిమ్॥

శ్లో॥ జ్ఞప్తిమాత్ర ముదాసీనం అద్వయానంద రూపిణమ్
భోక్తారమపి యజ్ఞానాం ఫలదాతారమద్వయమ్
త్రాతారం సర్వలోకానాం సంహర్తార మపి ప్రభో!

శ్లో॥ నమస్తే విశ్వరూపాయ జ్యోతిషాంపతయేనమః
అబాధిత స్వరూపాయ- పూర్ణాయ పరమాత్మనే॥

శ్లో॥ సూ త్రాత్మనే నమస్తుభ్యం సూక్ష్మరూపాయ విష్ణవే
శంకరాయాది దేవాయ-యోగినాం పతయేనమః॥

శ్లో॥ జ్యోతి రూపాయ రూపాయ-విరూపాయ సురూపిణే
భుజోర్ధ్వార్ధావతారాయ-దివ్యమంగళరూపిణే

- స త్య మ్ -





"త్వమేవ శరణం మమ"

# 3. పారాయణ విభాగము

## శ్రీ హనుమాన్ చాలీసా పారాయణము

(హనుమాన్ చాలీసా పారాయణము సుందరకాండ పారాయణతో సమానము.)

దినమునకు 11పర్యాయముల చొప్పున మండలము [40] రోజులు పారాయణము చేసిన సర్వకార్య సిద్ధి యగును.

నిత్యము మూడువేళల ఒక పర్యాయమైనను పఠించిన వారి యోగక్షేమములు భక్తరక్షకుడగు హనుమంతుడే తాను స్వయముగ చూచుకొనును.

ఒకే ఆసనమున కూర్చొని 108 పర్యాయములు దీక్షతో పఠించిన విశేష కార్యసిద్ధియగును.

శ్రీ గోస్వామి తులసీదాసు తపశ్శక్తి ధారపోసి రచించిన ఈ హనుమాన్ చాలీసాకే పై ఫలితములు చూచుకొననగును కాని అనువాదములకు కాదు.

పై ఫలశ్రుతి యదార్థమే తప్ప అందలి శయోక్తి ఏ మాత్రము లేదనుటకు అనేకులు పై ఫలితములు స్వయముగా పొందుటే నిదర్శనము.

భక్తి లోపమున్న చెప్పలేము. కాని హనుమాన్ చాలీసాలో శక్తి మాత్రము యదార్థము.

పారాయణమునకు, పఠనమునకు ముందు అమంగళ పరిహారమునకు ప్రార్థన చేయదగినది.

## ప్రార్థన

అవిఘ్నమస్తు - శ్రీరామాయనమః-హనుమతేనమః

శుక్లాంబరధరం విష్ణుం - శశివర్ణం చతుర్భుజం
ప్రసన్న వదనం ధ్యాయేత్ - సర్వవిఘ్నోపశాంతయే ॥

శ్రీరాఘవం దశరథాత్మజ మప్రమేయం
సీతాపతిం రఘుకులాన్వయ రత్నదీపం
ఆజానుబాహు మరవింద దళాయతాక్షం
రామం నిశాచర వినాశకరం నమామి

బుద్ధిర్బలం యశోధైర్యం నిర్భయత్వ మరోగతా
అజాడ్యం వాక్పటుత్వం చ హనుమత్స్మరణాద్భవేత్ ॥
అతులిత బలధామం స్వర్ణశైలాభదేహం
దనుజవన కృశానుం జ్ఞానినా మగ్రగణ్యమ్
సకలగుణ నిధానం వానరాణా మధీశం
రఘుపతి ప్రియభక్తం వాతజాతం నమామి ॥
గోష్పదీకృత వారాశిం మశకీకృత రాక్షసమ్
రామాయణ మహామాలా రత్నంవందేఽనిలాత్మజమ్ ॥

యత్ర యత్ర రఘునాథ కీర్తనమ్
తత్ర తత్ర కృతమస్తకాంజలిమ్
బాష్పవారి పరిపూర్ణలోచనమ్
మారుతిం నమత రాక్షసాంతకమ్.

మనోజవం మారుతతుల్యవేగం,
జితేంద్రియం బుద్ధిమతాం వరిష్ఠం
వాతాత్మజం వానరయూథముఖ్యం
శ్రీరామదూతం శిరసా నమామి

* శ్రీ హనుమాన్ చాలీసా *

శ్రీ గురుచరణ సరోజ రజ
నిజమన ముకుర సుధారి - సీతారామ్
వరణౌ రఘువర విమలయశ
జో దాయక ఫలచారి - సీతారామ్
బుద్ధిహీన తను జానికై
సుమిరౌ పవన కుమార్ - సీతారామ్
బల బుద్ధి విద్యా దేహు మొహి
హరహు కలేశవికార్ - సీతారామ్

* చౌపాయి *

జయ హనుమాన జ్ఞానగుణసాగర
జయ కపీశ తిహుంలోక వుజాగర

రామదూత అతులిత బలధామా
అంజనిపుత్ర పవనసుత నామా

మహావీర విక్రమ బజరంగీ
కుమతి నివార సుమతి కే సంగీ

కంచన వరణ విరాజ సువేశా
కానన కుండల కుంచిత కేశా

హాథవ్రజ అరుధ్వజా విరాజై
కాంధే మూంజ జనేవూ ఛాజై

శంకర సువన కేసరీ నందన
తేజ ప్రతాప మహా జగ వందన

విద్యావాన గుణీ అతిచాతుర
రామ కాజ కరివేకో ఆతుర

ప్రభుచరిత్ర సునివేకో రసియా
రామ లఖన సీతా మన బసియా

సూక్ష్మ రూప ధరి సియహిం దిఖావా
వికట రూప ధరి లంక జరావా

భీమ రూప ధరి అసుర సంహారే
రామచంద్ర కే కాజ సంవారే

లాయ సజీవన లఖన జియాయే
శ్రీ రఘువీర హరభివుర లాయే

రఘుపతి కీన్హీ బహుత బడాయీ
కహా భరత సమ తుమ ప్రియ భాయీ

సహాస వదన తుమ్హారో యశగావైఁ
అస కహి శ్రీపతి కంఠ లగావైఁ

సనకాదిక బ్రహ్మాది మునీశా
నారద శారద సహిత అహీశా

యమ కుబేర దిగపాల జహాఁతే
కవి కోవిద కహి సకై కహాఁతే

తుమ వుపకార సుగ్రీవ హిఁ కీన్హా
రామ మిలాయ రాజపద దీన్హా

తుమ్హారో మంత్ర విభీషణ మానా
లంకేశ్వర భయే సబ జగ జానా

యుగసహస్ర యోజన పరభానూ
లీల్యో తాహి మధుర ఫలజానూ

ప్రభు ముద్రికా మేలి ముఖ మాహీఁ
జలధి లాంఘిగయే అచరజ నాహీఁ

దుర్గమ కాజ జగతకే జేతే
సుగమ అనుగ్రహ తుమ్హారే తేతే

రామ దుఆరే తుమ రఖవారే
హోతన ఆజ్ఞా బిను పైసారే

సబ సుఖ లహై తుమ్హారీ శరనా
తుమ రక్షక కాహూకో డరనా

ఆపన తేజ సమ్హారో ఆపై
తీనోం లోక హాంకతే కాంపై

భూతపిశాచ నికట నహిం ఆవై
మహావీర జబ నామ సునావై

నాసై రోగ హరై సబపీరా
జపత నిరంతర హనుమత వీరా

సంకట సే హనుమాన ఛుడావై
మన క్రిమ వచన ధ్యాన జోలావై

సబ పర రామ రాయసిర తాజా
తినకే కాజ సకల తుమ సాజా

ఔర మనోరథ జో కోయి లావై
తాసు అమిత జీవన ఫల పావై

చారోం యుగ పరతాప తుమ్హారా
హైం పరసిద్ధి జగత ఉజియారా

సాధు సంతకే తుమ రఖవారే
అసుర నికందన రామ దులారే

అష్టసిద్ధి నవనిధికే దాతా
అసవర దీన్హా జానకీ మాతా

7)

రామ రసాయన తుమ్హారే పాసా
సాదర తుమ రఘుపతికే దాసా.
తుమ్హారే భజన రామకో భావై
జన్మ జన్మకే దుఖబిసరావై
అంతకాల రఘుపతిపుర జాయీ
జహాఁజన్మి హరిభక్త కహాయీ
ఔర దేవతా చిత్తన ధరయీ
హనుమత సేయి సర్వసుఖకరయీ
సంకట హటై మిటై సబ పీరా
జో సుమిరై హనుమత బలవీరా
జై జై జై హనుమాన గోసాయీఁ
కృపాకరో గురుదేవకీ నాయీ
యహ శతవార పాఠకర జోయీ
ఛూటహి బంది మహాసుఖ హోయీ
జో యహ పఢై హనుమాన చాలీసా
హోయ సిద్ధి సాఖి గౌరీశా
తులసీదాస సదా హరిచేరా
కీజైనాథ హృదయ మహఁడేరా॥

* "దోహా" *

పవనతనయ సంకటహరన
మంగల మూరతి రూప్ - సీతారామ్
రామ లఖన సీతాసహిత
హృదయ బసహు సురభూప్ - సీతారాం

— హనుమాన్ చాలీసా సంపూర్ణము —

# శ్రీ హనుమన్మాలా మంత్రము

(ఈ హనుమన్మాలామంత్రము అన్ని బాధలను తొలగించి రక్షించునని పెద్దలు చెప్పుట వలన, కొందరి అనుభవముల వలన కూడ తెలియుచున్నది. మాలామంత్రమునకు ఉపదేశాది నియమములు లేకున్నను ధ్యానమువలె పఠింపనగునని చెప్పుచున్నారు. కాన భక్తి తత్పరులై పఠించి స్వామి యనుగ్రహమునకు పాత్రులు కావచ్చును. సర్వవిధముల జ్వరములు, విషములు, ప్రయోగములు భూత ప్రేత పిశాచ గ్రహ బాధలనుండి విముక్తిచేయగల మాలా మంత్రమిది. నిత్యము ముమ్మారు లేదా ఒక్కమారైన పఠింపనగును. తెల్లవారుజామున ప్రతిదినము ఐదుమార్లు మానసికముగ పఠించిన సకల కార్యసిద్ధి. ప్రతి శనివారము దీక్షతో ముమ్మారు వేళల చదువుచు ఐదు అప్పములు శ్రీ ఆంజనేయునకు నైవేద్యము పెట్టవలెను. అట్టి దీక్ష నిర్వహించువారికి స్వామి స్వప్నమున సాక్షాత్కరించునని చెప్పబడుచున్నది.)

*　　*　　*

ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః ఓం నమో భగవతే పంచవక్త్ర హనూమతే ప్రకట పరాక్రమాక్రాంత సకల దిఙ్మండలాయ, నిజకీర్తి స్ఫూర్తిధావళ్య ధితా

నాయమాన జగత్త్రితయాయ, అతులబలైశ్వర్య రుద్రావ తారాయ, మైరావణ మదవారణ గర్వ నిర్వాపణోత్కంఠ కంఠీరవాయ, బ్రహ్మాస్త్రగర్వ సర్వంకషాయ, వజ్రశరీ రాయ, లంకాలంకారహారిణే, తృణీకృతార్ణవలంఘనాయ, అక్షశిక్షణ విచక్షణాయ, దశగ్రీవ గర్వపర్వతోత్పాట నాయ, లక్ష్మణ ప్రాణదాయినే, సీతామనోల్లాసకరాయ, రామమానస చకోరామృతకరాయ, మణికుండలమండిత గండస్థలాయ, మందహాసోజ్జ్వల న్ముఖారవిందాయ, మౌంజీ కౌపీన విరాజత్కటితటాయ, కనకయజ్ఞోపవీతాయ, దుర్వార వారకీలిత లంబశిఖాయ, తటిత్కోటి సముజ్జ్వల పీతాంబరాలంకృతాయ, తప్త జాంబూనదప్రభాభాసుర రమ్య దివ్యమంగళ విగ్రహాయ, మణిమయగ్రైవే యాంగద హారకింకిణీ కిరీటోదారమూర్తయే, రక్తపంకే రుహాక్షాయ, త్రిపంచనయన స్ఫురత్పంచవక్త్ర ఖట్వాంగ త్రిశూల ఖడ్గోగ్ర పాశాంకుశ క్ష్మాధర భూరుహ కౌమో దకీ కపాల హలభృద్దశభుజాటోపప్రతాప భూషణాయ, వానరనృసింహ తార్క్ష్య వరాహ హయగ్రీవానన ధరాయ, నిరంకుశ వాగ్వైభవప్రదాయ, తత్త్వజ్ఞానదాయినే, సర్వో త్కృష్ట ఫలప్రదాయ, సుకుమార బ్రహ్మచారిణే, భరత ప్రాణసంరక్షణాయ, గంభీర శబ్దశాలినే, సర్వపాప వినా శాయ, రామసుగ్రీవ సంధానచాతుర్యప్రభావాయ, సుగ్రీ వాహ్లాదకారిణే, వాలి వినాశకారణాయ, రుద్రతేజస్వినే, వాయునందనాయ, అంజనాగర్భరత్నాకరామృతకరాయ,

నిరంతర రామచంద్రపాదారవింద మకరంద మత్త మధుర కరాయ, మాణ మానసాయ, నిజవాల వలయీకృత కపి సైన్య ప్రాకారాయ, సకల జగన్మోదకోత్కృష్ట కార్య నిర్వాహకాయ, కేసరీనందనాయ, కపికుంజరాయ, భవిష్య ద్బ్రహ్మణే ఓం నమో భగవతే పంచవక్త్ర హనూమతే తేజోరాశే ఏహ్యేహి దేవభయం, అసురభయం గంధర్వ భయం యక్షభయం బ్రహ్మరాక్షసభయం భూతభయం ప్రేతభయం పిశాచభయం విద్రావయ విద్రావయ॥ రాజ భయం చోరభయం శత్రుభయం సర్పభయం వృశ్చిక భయం మృగభయం పక్షిభయం క్రిమిభయం కీటకభయం ఖాదయ ఖాదయ। ఓం నమో భగవతే పంచవక్త్ర హనూ మతే జగదాశ్చర్యకర శౌర్యశాలినే ఏహ్యేహి శ్రవణజ భూతానాం దృష్టిజభూతానాం శాకినీ, ఢాకినీ కామినీ మోహినీనాం భేతాళ బ్రహ్మరాక్షస సకల కూశ్మాండానాః విషయదుష్టానాం విషమవిశేషజానాం భయం హరహర మథమథ భేదయభేదయ ఛేదయఛేదయ మారయమారయ, శోషయశోషయ ప్రహరయ ప్రహరయ ఠఠఠఠ ఖఖఖఖ ఖేఖే ఓం నమో భగవతే పంచ వక్త్ర హనూమతే శృంఖలాబంధ విమోచనాయ ఉమా మహేశ్వర తేజో మహిమావతార సర్వవిషభేదన సర్వ భయోత్పాటన సర్వజ్వరచ్ఛేదన సర్వభయభంజన ఓంనమో, భగవతే పంచవక్త్రహనూమతే కబలీకృతార్కమండల భూత మండల ప్రేతమండల పిశాచమండలాన్నిర్ఘాటయన్నిర్ఘాటాయ

భూతజ్వర ప్రేతజ్వర పిశాచజ్వర మాహేశ్వరజ్వర భేతాళ జ్వర బ్రహ్మరాక్షసజ్వర ఐకాహికజ్వర ద్వ్యాహిక జ్వర త్ర్యాహికజ్వర చాతుర్థికజ్వర పాంచరాత్రికజ్వర విషమజ్వర దోషజ్వర బ్రిహ్మరాక్షసజ్వర భేతాళపాశ మహానాగకులవిషం నిర్విషం కురుకురు ఝట ఝట దహ దహ। ఓంనమో భగవతే పంచవక్త్ర హనూమతే కాల రుద్ర రౌద్రావతార సర్వగ్రహానుచ్చాటయోచ్చాటయ ఆహ ఆహ ఏహిఏహి దశదిశో బంధ బంధ సర్వతో రక్ష రక్ష సర్వశత్రూన్ కంపయకంపయ మారయ మారయ దాహయదాహయ కబళయకబళయ సర్వజనా నావేశయ ఆవేశయ మోహయమోహాయ ఆకర్షయ ఆకర్షయ। ఓంనమో భగవతే పంచవక్త్ర హనూమతే జగద్గీత కీర్తయే ప్రత్యర్థి దర్ప దళనాయ పరమంత్రదర్ప దళనాయ పరమంత్ర ప్రాణనాశాయ ఆత్మమంత్ర పరిరక్ష ణాయ పరబలం ఖాదయఖాదయ క్షోభయక్షోభయ హరయహరయ త్వద్భక్త మనోరథాని పూరయ పూరయ సకల సంజీవినీ నాయకవరం మే దాపయ దాపయ। ఓంనమో భగవతే పంచవక్త్రి హనూమతే ఓం హ్రాం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హ్రాం శ్రీం భ్రీం ఘ్రీం ఓం న్రాం క్లీం హ్రీం హ్రీం హ్రూం హ్రైం హ్రౌం హ్రః హ్లుం ఫట్ ఖే ఖే హుం ఫట్ స్వాహా.

—: X ;—

# శ్రీ ఆంజనేయ దండకము

శ్రీ ఆంజనేయం ప్రసన్నాంజనేయం ప్రభాదివ్యకాయం ప్రకీర్తిప్రదాయం భజే వాయుపుత్రం భజే వాలగాత్రం భజేఽహం పవిత్రం భజే సూర్యమిత్రం భజే రుద్రరూపం భజే బ్రహ్మతేజం బటంచున్ ప్రభాతంబు సాయాహ్నమున్నీదు సంకీర్తనల్ జేసి నీ రూపు వర్ణించి నీమీద నే దండకంబొక్కటింబాడ నూహించి నీ మూర్తినిం గాంచి నీ సుందరం బెంచి నీ దాసదాసుండనై రామభక్తుండనై నిన్ను నే గొల్చెదన్ నిన్ను నే నెంచెదన్ నీ కటాక్షంబునన్ జూడుమా వేడుకల్ జేయుమా నా మొరాలించుమా నన్ను రక్షించుమా అంజనాదేవి గర్భోదయా దేవ నిన్నెంచ నేనెంతవాడన్ దయాశాలివై చూడుమా దాతవై బ్రోవుమా దగ్గరన్నిల్వుమా తొల్లి సుగ్రీవుకున్మంత్రివై స్వామికార్యంబునందుండి శ్రీరామసౌమిత్రులం జూచి వారిన్విచారించి సర్వేశు పూజించి ఆభానుజుం బంటు గావించి అవ్వాలినిం జంపి కాకుత్థవర్యుం దయాదృష్టి వీక్షించి కిష్కింధ నేలించి శ్రీరామకార్యార్థివై లంక కేతెంచియున్ లంకిణిన్ జంపియున్ లంకనున్ గాల్చియున్ భూమిజంజూచి యానంద ముప్పొంగి యా యుంగరం బిచ్చి యా రత్నముం దెచ్చి శ్రీరాము సంతోషితుం జేసి సుగ్రీవున్ జాంబవంతుం నలుం నీలు ఆ అంగదున్ కూడి

యున్ సేతువున్ దాటి కీశౌఘసంఘంబుచే దైత్యుల్యం
దుఱించగా రావణుండంత కాలాగ్నియై యుగ్రుడై ఘోర
బ్రహ్మాండమైనట్టి యాశక్తినిన్ వైచి సౌమిత్రినిన్ మూర్ఛ
నొందింపగా నప్పుడేపోయి సంజీవినిన్ దెచ్చి రామానుజ
ప్రాణముల్ రక్ష కావించియున్ కుంభకర్ణాది వీరాధివీరుల్
మరింబోర శ్రీరామబాణాగ్ని వారందరిన్ రావణుంగూడ
జంపంగ లోకంబు లానందమైయుండ యవ్వేళలందున్
సురారిం మరిం వేడుకన్ దోడుకన్ వచ్చి పట్టాభిషేకంబు
చేయించి సీతామహాదేవినిం దెచ్చి శ్రీరాముడున్ మెచ్చి
అయోధ్యకున్ వచ్చి పట్టాభిషేకం బనేకంబు సంరంభమై
యున్న నీకన్న నాకెవ్వరున్ కూర్మిలేరంచు మన్నించినన్
రామభక్తి ప్రశస్తంబుగా నిన్ను, నీనామసంకీర్తనల్ జేసి
నన్ పాపముల్ బాయునే భీతియున్ దీరునే భాగ్యముల్
గల్గునే సర్వసామ్రాజ్యముల్ సర్వసంపత్తులున్ కల్గునే యో
వానరాకార యోభక్తమందార యోపుణ్యసంచార యోధీర
యోవీర నీవే సమస్తంబు నీవే మహావీరు డీవే మహా
శక్తివై తారకబ్రహ్మ మంత్రస్మృతిం జేసి స్థైర్యమ్ముగా
వజ్రదేహమ్మునుం దాల్చి శ్రీరామ శ్రీరామ శ్రీరామ
యంచున్ మనఃపూతమై యెప్పుడుం దప్పకన్ దల్చు నా
జిహ్వయందుండి నీదీర్ఘ దేహంబునన్ లోకసంచారివై
రామనామాంకితధ్యానివై బ్రహ్మవై బ్రహ్మతేజంబునన్
రౌద్రనిజ్వాల కల్లోల హావీర యోధీర ఓంకార ఓంకార

ఓంకార శబ్దంబులన్ భూతపైశాచికా శాకినీ ఢాకినీ గాలి దయ్యంబులన్ నీదు వాలంబునన్ జుట్టి నేలంబడగొట్టి నీముష్టి ఘాతంబులన్ బాహుదండంబులన్ రోమఖండంబునన్ ద్రుంచి కాలాగ్నిరుద్రుండవై బ్రహ్మతేజ ప్రభాభాసితంబైన నీ దివ్యతేజంబున్ జూపి రారాభక్తయంచున్ దయాదృష్టి వీక్షించి నన్నేలు స్వామీ! నమస్తే సదాబ్రహ్మచారీ నమస్తే మహా వాయుపుత్రా నమస్తే నమః

* * *

## ప్రకారాంతరేణ హనుమత్ స్తోత్రం

(ఈ ప్రకారము హనుమత్ స్తోత్రము అనేక విధముల విధముల మేలు గూర్చగది. యుద్ధములోగాని, శత్రుమధ్యమున గాని, సముద్రతరణమునగాని, సింహవ్యాఘ్రసర్పాది భయము కలిగినప్పుడుగాని, రాజద్వారమునగాని, మార్గమున గాని, గుహాలయందుగాని, భూతప్రేత గ్రహాది బాధలందు గాని, శాకినీ, ఢాకినీ ప్రమాదములగాని విస్ఫోటాది బాధలందుగాని, జ్వరశిరో వేదనాలందుగాని, ఈ స్తోత్రము భక్తి తత్పరులై చేసినచో సర్వ భయములను హనుమంతుడు తొలగించునని ఫలశ్రుతి చెప్పుచున్నది.)

8)

శ్లో|| శం శం శం సిద్ధినాథం ప్రణమతిచరణం
వాయుపుత్రం చ రౌద్రం||
వం వం విశ్వరూపం హ హ హ హ హసితం
గర్జితం మేఘచిత్రం||
తం తం తంత్రై త్రిలోక్యనాథం తపతి దినకరం
తంత్రినేత్ర స్వరూపం||
కం కం కం కందర్పవశ్యం కమలమనహరం
శాకినీకాలరూపం||

శ్లో|| రం రం రం రామదూతం రణగజదమితం
రావణచ్ఛేద దక్షం|
బం బం బం బాలరూపం నతగిరిచరణం కంపితం
సూర్యబింబం|
మం మం మం మంత్రసిద్ధం కపికులతిలకం
మర్దనం శాకినీనాం|
హుం హుం హుం హుంకారబీజం హనతిహనుమతం
హన్యతే శత్రుసైన్యం|
దం దం దం దీర్ఘరూపం ధరఖరశిఖరం పాతితం
మేఘనాదం||
ఊం ఊం ఊం ఉచ్చాటితంత్వ సకలభువతలం
యోగినీబృందరూపం|
క్షం క్షం క్షం క్షిప్రవేగం క్రమతి చ జలధిం
జ్వాలితం శత్రుదుర్గం|

